ఓం 3.

శ్రీ వెంకట నరసింహా యోగీశ్వరగురుభ్యో

పరబ్రహ్మణేనమః.

# శ్రీ హరిహర

# పశుపతీశ్వర శతకము

(౧)

గ్రంథకర్త.

మైనముపాటి శివనారాయణ మూర్తి.

---

నరసరావుపేట రామకృష్ణ ముద్రాక్షరశాల యందు

ముద్రింపబడియె.

1940

---



# విజ్ఞప్తి

—:o:—

మహాశయులారా! భారతీయ సోదరులారా!!

ఈ ప్రమాదినామ సంవత్సర మార్గశిర బ ౧౩ లు ఆదివారం (7–1–1940) న మద్గురు ఆశ్రమము దర్శించు ఉత్సాహమున ఇక్కుర్తి గిరిజని తిలకించి ఆపర్వతశిఖరమున వేంచేసియున్న శ్రీ రామలింగేశ్వర స్వామివారిని సేవించి ఆరాత్రియు మరురోజు ఆ పరమేశ్వరు సన్నిధాన మున నివసించితి. సోమవారం తెల్లవారుఝామున నాలో నాకు యీ చిన్న శతకము వ్రాయు సంకల్పము గలిగి ప్రారంభించి నా శక్తి కొలది వ్రాసితి.

దరిమిలా నరసరావుపేటలో మద్గురుభక్తులగు మ॥ రా॥ శ్రీ ముప్పాళ్ళ శ్రీనివాసరావు, గడ్డం కోటయ్యగార్లు మీరు యేమి వ్రా యుచున్నారని ప్రశ్నించ చదివి వినిపించితి. వారానందమొంది అచ్చు వేయించవలసినదిగా కోరిన వారలకోర్కె నెరవేర్ప వెంటనే అచ్చు వేయించితి. యిందు బహులోపములుండవచ్చును. చదువరు లందరును ఆ లోపములనుమాత్రమే యెన్నక అర్థమును గ్రహించి ఆస్వాదింపఁ జేయఁ బ్రార్థించెద. మరియు నాయందనుగ్రహముంచి తమకుతోచిన లోపములు నాకు తెలియ జేసిన ద్వితీయ ముద్రణమున సవరించు కొనియెద.

ఈ శతకము వ్రాయుటలో నాకు యెక్కువసలహానిచ్చి తోడ్ప డిన బ్ర॥ శ్రీ॥ సోమరాజు రామచంద్రయ్య గారికి అనేక నమస్కార ము లర్పించుచున్నాను.

ఇట్లు సర్వజన విధేయుడు,

మైనముపాటి శివనారాయణ మూర్తి.



ఓం 3.

శ్రీ వెంకట నరసింహ యోగీశ్వర గురు

పరబ్రహ్మణేనమః.

## శ్రీ హరిహర

# పశుపతీశ్వర శతకము

(౦)

సీ॥ శ్రీగణనాధుని స్థిరభక్తి సేవించి భారతీదేవిని ప్రస్తుతించి
వ్యాస పరాశర వాల్మీకి శుక భరద్వాజుడాదిగ ఋషివరుల గొలచి
భాస్కరు సన్నయభట్టు పోతన కాళిదాసాది కవుల ప్రార్థన మొనర్చి
వసుధాస్థలంబున వరలు సత్కవులకు వందన శతములు వాంఛ జేసి
గీ॥ నాదు గురుడైన విప్రరాట్ నరసయోగి। పాదములుగొల్చి భక్తిని
ప్రణుతి జేసి। చిత్తసత్తుల నిన్నుంచి చెప్పనాడ। భవవినాశక
హరి హర పశుపతీశ॥ 1

సీ॥ శాస్త్రజాలంబులు చదివిచూడగ లేదు మఱియుపురాణముల్ మమతతో
పఠియించగాలేదు బహువిధలక్షణగ్రంధరాజముల నేగనియెరుంగ (ద
వ్యాకరణ పదములు వల్లించగాలేదు సూత్రభాష్యంబులుచూడలేదు
పెద్దలగనుగొని వద్దజేరియు వారి పాదముల్ సేవించి భక్తితోడ
గీ॥ ఆశ్రయించియు యేబోధ లందియెఱుగ। సర్వమున యొక్క రీతిని
సాధుబుద్ధి। వర్తలుచు ప్రార్థన మొనర్తు వరదనిన్ను। భవ వినాశక
హరి హర పశుపతీశ॥ 2

సీ॥ చెప్పెద నేనొక్క చిన్నదౌ శతకము చిన్నసంశయుడనై సీసములను
యున్ని తీరుగను యతిగణప్రాసముల్ చిన్నవాడను గురుసేవ జేసి
మత్తుడ పాపుడ మతిహీనుడను పర సతికి చేచిక్కిన చపలగుణుడ
తప్పులో నప్పులో దడయక గూర్చెద చెరకువంకైనను చెడున తీపి
గీ॥ నిన్నుగాని యీడ తప్పెట్లు నిలచునయ్య। సర్వమున నీవు నిలచిన
సరణిగనిన। తప్పువప్పుల నెన్నంగ ధర్మమగునె। భవవి॥ 3
సీ॥ జగతి ధర్మంబుల చర్చించి చూడంగ జాతిమత్సరములచేత వెలసె
జాతి ధర్మంబుల సరణి చెప్పెటిగాని చరియించగాబోరు జగతిజనులు
జాతి మొక్కనయంచు చండాలసేవల చరియించువారికి జాతిగలదె
తనజాతిధర్మంబు తప్పకనడచిన తమ వినాశంబగు తగ్గుదెన
గీ॥ మెచ్చు ధర్మైన తనరదు మెచ్చు సుఖము॥ నిశ్చయముగన్న జగతిని
నిన్నుగొల్వ। జాతిమతిధర్మభేదముల్ జాడనగునె। భవవి॥ 4
సీ॥ జనని బ్రాహ్మణజాతి జనకుడేక్రియవాడొ తనయునికుల మేదొ తరుణి
జనకుడుజననియు జాతిధర్మముగను నిలిచియుండచిన నిలచుకులము (ఎవరో
జనని ధర్మముదప్పి సంచరించిన తండ్రి సద్ధర్మమునయున్న జాతిలేదు
తన జన్మమాదిని తల్లిదండ్రులమది దలియించి పరులపై జలగనేది
గీ॥ జన్మసంకర మయ్యెను జాతదేదొ। అంగ లింగాల సంగముచందు
సుతుని। జాతి జననికి తెలియును సత్యముగను। భవవి॥ 5
సీ॥ బ్రాహ్మణకులమున ప్రభవించినంత నే బ్రహ్మత్వమబ్బునా బ్రహ్మజాతి
కర్మలు నడువక కాశికి జనినను నిర్మలమబ్బునా నియతిలేక
కర్మలు జేయుచు కర్మఫలంబున కాంక్షవదలకున్న కర్మ తెగున
జాడ్యము మెడదాల్చి జపతపంబులుసల్పు మర్మము గంగక మాయ తెగున
గీ॥ జన్మకర్మలజాడల చర్చ జేసి। మనసు మనసున జయమునంది మనసునిలిపి
ఆత్మగతిగూడకను నిను అందనగునె। భవవి॥ 6
సీ॥ ఆశను పాశము లేశమెంచకగోసి ఆనందమయుడయ్యి అన్నిటందు
వేషభాషలుమాని వేరుచింతలులేక భోగంబులనుగోసి బుద్ధినిలిపి
భూతజాలములందు పూర్ణమౌదయగల్గి హింస జేయుటమాని హంస నెరిగి
అఖిలకర్మలు జేసి ఆరిటిదెగగోసి। ఆరుమూడిటిమాని అహముపిడచి।
అంత యిరువదొక వెయ్యిఆరునూర్లు। హంసజపమును అర్పించి హంస
లయము। నందకుండిన నీఐక్యమందనగునె। భవవి॥ 7

సీ॥ సుజనగోష్ఠియుగల్గి కుజనసంగతిమాని విజనస్థలంబున వేడ్క నిలచి
గుణములన్నియుఁబీడి గురువరు సేవించి కూర్చుండి భ్రూమధ్యగురిని నిలపి
మానసముతో నుండి మనసు యింద్రియప్రాణమారుతంబులనందు మగ్నపరచి
జిహ్వాగ్రమును ద్రిప్పి చిన్ని నాలుక కూటితో జేర్చి చిన్ముద్రతో డనిలచి
గీ॥ మది నిమీలితనేత్రుఁడై మరచి తన్ను । తనదు తనువునగనియును దనరి
నిన్ను । అంటుగనుగొన్న మరి జన్మలందబోరు । భవవి॥ 8

సీ॥ విశ్వేశ విశ్వాత్మ విశ్వంబునకతీత విశ్వస్వరూపక విశ్వనిలయ
విశ్వసృష్టిస్థితి విలయకారణకర్త విశ్వసంరక్షణ విశ్వతేజ
విశ్వజనాధార విశ్వసేవితపాద విశ్వమోహనరూప విశ్వవరద
విశ్వపాపవినాశ విశ్వజ్ఞ మునిపోష విశ్వపావన సదా విశ్వవంద్య
గీ॥ విశ్వసంహారకారణ వేదవేద్య । విశ్వమును కుక్షినిడుకొన్న విధివిధాన
విశ్వవిధిబాపుకర్తవు విధివి నిధివి । భవవి॥ 9

సీ॥ సగుణ నిర్గుణరూప సర్వవిద్యాధార సత్యస్వరూపక సంగరహిత
జీవాత్మపరమాత్మ శివకర శ్రీలోల మునిపాలఘనకాయ పుణ్యపురుష
ఆదిస్వరూపక అచలాత్మ అధికాత్మ ఆనందమయరూప అసురశిక్ష
కాంచనాంబరధర కమనీయమృదుగాత్ర కనకాచలనివాస కలివినాశ
గీ॥ నాదబిందుకళాతీత భేదరహిత । నవ్యశుభగాత్ర రవిశశినయనయుగళ
మణిమయకిరీటమస్తక మహితవేష । భవవి॥ 10

సీ॥ వాచామగోచర వాదభేదాతీత వైరాగ్యగుణయుత వర్ణరహిత
వైకుంఠపురవాస వాసుకిభూషణ వైడూర్య మణి రత్న వజ్రకవచ
వనమాలికాహార వక్షస్థలవిశాల వజ్రకంకణహస్త వనధిశయన
పంచకోశాతీత బ్రహ్మవిద్యాకార నిత్యనిరంజన నిర్వికార
గీ॥ అచ్యుతానంతగోవింద అబ్జనేత్ర । ఆదికాదులకాదియౌరా ఆదిపురుష
వర్ణనాతీత ముచికుంద వరద యీశ । భవవి॥ 11

సీ॥ జన్మంబు మరణంబు జాతినీతులు లేవు సుఖదుఃఖముల నెన్ని చూడబోవు
చలియుండవానలజంకవు మరి జయమునఁ బ్రీతి అపజయమున నువగయు
జెందవు భయమును జెందనేరవు మరి ఆదిఅంత్యంబులు అందబోవు
నష్ట లాభములందునను లక్ష్యమే లేదు కామక్రోధముల నేకలతబడవు
గీ॥ సఖులు రిపులను భేదంబు సలుపవెపుడు । లోభ మద మత్సరంబుల
లోంగబోవు । నీదువిధమెన్నతరమా నిఖిలరూప । భవవి॥ 12

సీ॥ యేదిక్కునను జూడ యేకమై నీవున్న జాడ నెరుంగరు జగతిజనులు
అచలమచలమన్న అచలమందున యున్న అర్థమెరుంగరు వ్యర్థులగుచు
అచలమైయుండు నీవు ఆనందముగ యున్న అంతు తెల్యగ లేరు కొంతమంది
జీవులలోపల చిత్కళరూపమై వెలుగుచునున్నట్టి విధము తెలియ
గీ॥ జాలనేరక మాయను జలగి అచల । మునను పరమాత్మ వుని కెట్లు
గనుటయెట్లు । యనుచు బల్కుదురందు నిన్నరయలేక । భవప॥ 13

సీ॥ వున్నావొ లేవో నీవున్న చోటెచ్చటో వూహించి గనిన నీవున్న విధము
వుంటివా కారమై వుర్వి కెల్లను మరి గగనంబునందున గాలియందు
అగ్ని జలంబుల ఓషధులందును అందిందనరాక అన్నిటందు
వుంటివి స్థిరముగా వున్నట్లు గనరాక అచలరూపుడవయ్యి యరసి గనిన
గీ॥ నీవుయుండిన సర్వము నిలచియుండు । నీవు లేకున్న పకటియు నిలువ
బోదు । గాన నీతావు వునికియు గనవశంబె । భవప॥ 14

సీ॥ అజుడవు వర్ణరహితుడవు అమలుడవు అనాదిపురుషుండవు పరిపూర్ణుడవు
కాలరూపుడవును కర్తవు భోక్తవు కర్మకారణుడవు గతివి పతివి [illegible]ను
కలిరూపుడవు మరి కలివినాశకుడవు తగ్గని పెరుగని తల్పకుడవు
యిచ్ఛావిహారి [illegible] హైన వేల్పువు సచ్చరిత్రుండవు సాధకుడవు
గీ॥ కర్మచేయించు వాడవు కర్మఫలము । నొసగుదాతవు అకర్మయున్ను
అయ్యు । సముడు అధికుండు లేనట్టి సాక్షివి । భవప॥ 15

సీ॥ శివుడవు అజుడవు శ్రీకృష్ణుడవు ఆదిపురాణపురుషుడవు ప్రభుడవీవు
సంకల్పమయమగు సగుణశక్తియు నీవు చంద్రసూర్యులు నీవు శబ్దమీవు
జ్ఞానమజ్ఞానము జ్ఞాపకశక్తియు మంత్రయంత్రంబుల మహిమ నీవు
పూజకు నాలవాల పురుషోత్తముడవీవు పుణ్యపాపములెన్న బుధుడవీవు
గీ॥ మాయవదలించి సుఖమిచ్చు మంత్రమీవు । మనసు మరపించు సాధన
మార్గమీవు । మేరలేనట్టి సాయుజ్యమీవయగును । భవప॥ 16

సీ॥ చక్కని వేల్పువు పక్కడవీవుండ సెక్కువేల్పుల జేరి మొక్క నేల
చక్రాంకితపులను పక్కలు చూడక వక్కదిక్కున బుద్ధి చిక్కబట్టి
దిక్కు నీవని నమ్మి మిక్కిలి భక్తితో చక్కగా గొల్చిన నిక్కముగను
చిక్కులు దీర్చి నా దిక్కున నీవుండి యెక్కువ పదమివ్వ తక్కువేమి
గీ॥ యెక్కువేలను జగతీశ నిక్కముగను । యొక్కటను రెప్పపాటు సియొ
క్కరూపు । చక్కగా నిల్పి జూపిన జాలునయ్య । భవప॥ 17

సీ॥ సుజనగోష్ఠియుఁగల్గి కుజనసంగతిమాని విజనస్థలంబున వేడ్కఁ నిలచి
గుణములన్నియుఁవీడి గురువరుసేసించి కూర్చుండి భ్రూమధ్యగురినినిలపి
మానముతోనుండి మనసుయింద్రియప్రాణమారుతంబులసందుమగ్నపరచి
జిహ్వాగ్రమునుద్రిప్పి చిన్ని నాలుక కూటితో జేర్చిచిన్ముద్రతోడనిలచి
గీ॥ మరి నిమీలితనేత్రుడై మరచితన్ను । తనదు తనువునగనియును దనరి
నిన్ను । అంటుగనుగొన్న మరి జన్మలందబోరు । భవవి॥ 8
సీ విశ్వేశ విశ్వాత్మ విశ్వంబునకతీత విశ్వస్వరూపక విశ్వనిలయ
విశ్వసృష్టిస్థితి విలయకారణకర్త విశ్వసంరక్షణ విశ్వతేజ
విశ్వజనాధార విశ్వసేవితపాద విశ్వమోహనరూప విశ్వవరద
విశ్వపాపవినాశ విశ్వజ్ఞ మునిపోష విశ్వపావన సదా విశ్వవంద్య
గీ॥ విశ్వసంహారకారణ వేదవేద్య । విశ్వమును కుక్షినిడుకొన్న విధివిధాన
విశ్వవిధిబాపుకర్తవు విధపి నిధివి । భవవి॥ 9
సీ॥ సగుణ నిర్గుణరూప సర్వవిద్యాధార సత్యస్వరూపక సంగరహిత
జీవాత్మపరమాత్మశివకర శ్రీలోల మునిపాలఘనకాయపుణ్యపురుష
ఆదిస్వరూపక అచలాత్మ అధికాత్మ ఆనందమయరూప అసురశిక్ష
కాంచనాంబరధర కమనీయమృదుగాత్ర కనకాచలనివాస కలివినాశ
గీ॥ నాదబిందుకళాతీత భేదరహిత । నవ్యశుభగాత్ర రవిశశినయనయుగళ
మణిమయకిరీటమస్తక మహితవేష । భవవి॥ 10
సీ। వాచామగోచర వాదభేదాతీత వైరాగ్యగుణయుత వర్ణరహిత
వైకుంఠపురవాస వాసుకిభూషణ వైడూర్య మణి రత్న వజ్రకవచ
వనమాలికాహార వక్షస్థలవిశాల వజ్రకంకణహస్త వనధిశయన
పంచకోశాతీత బ్రహ్మవిద్యాకార నిత్యనిరంజన నిర్వికార
గీ॥ అచ్యుతానంతగోవింద అబ్జనేత్ర । ఆదికాదులకాదియా ఆదిపురుష
వర్ణనాతీత ముచికుంద వరద యీశ । భవవి॥ 11
సీ॥ జన్మంబు మరణంబు జాతినీతులులేవు సుఖదుఃఖములనెన్నిచూడబోవు
చలియెండవానలజంకవు మరి జయముసప్రీతి అపజయమునువగయు
జెందవు భయమును జెందనేరవు మరి ఆదిఅంత్యంబులు అందబోవు
నష్ట లాభములందునను లక్ష్యమేలేదు కామక్రోధములనేకలతబడవు
గీ॥ సఖులు రిపులను భేదంబు సలుపవెపుడు । లోభ మద మత్సరంబుల
లోంగబోవు । నీదువిధమెన్నతరమా నిఖిలరూప । భవవి॥ 13

సీ॥ యేదిక్కునను జూడ యేకమై నీవున్న జాడ నెరుంగరు జగతిజనులు
అచలమచలమన్న అచలమందునయున్న అర్థమెరుంగరు వ్యర్థులగుచు
అచలమైయున్ననునీవుఆనందముగయున్న అంతు తెల్యగలేరు కొంతమంది
జీవులలోపల చిత్కళరూపమై వెలుగుచున్నట్టి విధము తెలియ
గీ॥ జాలనేరక మాయనుజలగి అచల । మునను పరమాత్మ వునికెట్లు
గనుటయెట్లు । యనుచుబల్కుదురందు నిన్నరయలేక । భవ॥ 13
సీ॥ వున్నావొ లేవొ నీవున్నచో టెచ్చటో వ్రాహించిగనిన నీవున్న విధము
వుంటివాధారమై వృథ్వికెల్లను మరి గగనంబునందున గాలియందు
అగ్ని జలంబుల ఓషధులందును అందిందనరాక అన్నిటందు
వుంటివి స్థిరముగా వున్నట్లుగనరాక అచలరూపుడవయ్యు [illegible] గనిన
గీ॥ నీవుయుండిన సర్వము నిలచియుండు । నీవులేకున్న వకటియు నిలువ
బోదు । గాన నీ తావు వుసికియు గనవశంబె । భవ॥ 14
సీ॥ అజుడ వవ్యయుడవు అమలుడవు అనాదఫ [illegible] పూర్ణుడవు
కాలరూపుడవును కర్తవు భోక్తవు కర్మకారణుడవు గతివిపతివి [illegible]
కలిరూపుడవు మరి కలివినాశకుడవు [illegible] విల్పకుడవు
యిచ్ఛావిహార [illegible] సచ్చరిత్రుడవు సాధకుడవు
గీ॥ కర్మచేయించువాడవు కర్మఫలము । నొసగుదాతవు ఆకర్మయున్న
అయ్యు । సముడు అధికుండు లేనట్టి సాక్షివివు । భవ॥ 15
సీ॥ శివుడవు అజుడవు శ్రీకృష్ణుడవు ఆదిపురుషరూపుడవు ప్రభుడవీవు
సంకల్పమయమగు సగుణశక్తియు నీవు చంద్రసూర్యులు నీవు శబ్దమీవు
జ్ఞానమజ్ఞానము జ్ఞాపకశక్తియు మాత్రయంత్రంబుల నుహిమ నీవు
పూజకుఁగాలమా పురుషోత్తముడవీవు పుణ్యపాపములిచ్చు బుధుడవీవు
గీ॥ మాయవదలించి సుఖమిచ్చు మంత్రమీవు । మనసుమరపించు జ్ఞాన
మార్గమీవు । మేరలేనట్టి సాయుజ్యమీవయగును । భవ॥ 16
సీ॥ చక్కనివేల్పువు వక్కడవీవుండ పెక్కువేల్పుల జేరి మొక్కనేల
చక్రాంకి రిపులను పక్కలుచూడక వక్కదిక్కున బుద్ధి చిక్కబట్టి
దిక్కునీవనినమ్మి మిక్కిలిభక్తితో చక్కగానొల్చిన నిక్కముగను
చిక్కులుదీర్చి నాదిక్కున నీవుండి యెక్కువపదమివ్వ తక్కువేమి
గీ॥ యెక్కువేలనుజగతీశ నిక్కముగను । యొక్క కనురెప్పపాటు నీయొ
క్కరూపు । చక్కగానిల్పిజూపినజాలునయ్య । భవ॥ 17

సీ॥ అందిందుయనుగాక యందునగనరాక అంతనీవైయుంటి వింతగాను
అందుచే నీయునికి అందజాలక మున్ను అందిందుతిరిగిరి ఆదిమునులు
చూడ నేత్రములున్న చూచినచో నెల్ల సిద్ధమైయుంటివి స్థిరముగాను
చూడజాలరు నిన్ను చూచిచెప్పగలేరు చూచినవిధమంత సుందరముగ
గీ॥ చెప్ప వింతగవిని సంతసించిపిడప। చెప్పజాలరువినుకాలమప్పుడైన।
అర్థమెఱుగగలేరు నిరర్థులగుచు। భవ॥ 18
సీ॥ వందనీయుడవీవు అందిందుయనరాక పొందుగా అన్నిచోట్లందముగను
ఆనందమయుడవు అన్నిట దిశలను పర్వంబులందున బయలునందు
విజ్ఞానమయుడవు విధినిషేధములందు ప్రజ్ఞలెఱుంగవు ప్రభలు లేవు
స్వప్రకాశుండవు సంధ్యల వంద్యుల సందేహములు లేవు సర్వగుడవు
గీ॥ అద్వయుడవు అనంతుడవచ్యుతుడవు। అమలుడవు అశరీరివి ఆద్యు
డవును। వేదవిదుడవు వేదాంతవేద్యుడవును। భవ॥ 19
సీ॥ సగుణుడవీవని చెప్పంచిగనబోవ సగుణమెప్పటికైన సమసిపోవు
నిర్గుణుండవుయన్న నిలువచోటే లేదు నినుజూచుటెచ్చట నిలుచుటెచట
ద్వైతభావుడవంచు తరచిచూచెదమన్న కర్మకూలము లేక కలతగలిగె
యీమూడువిధులలో యేదియుగాకను వెలసియుండితివన్న వేదధర్మ
గీ॥ మెల్లతోలగును మతకర్తలెన్ని పలుకు। మతవిధానములును తప్పు మరి
యు నిన్ను। యెటులగని నిర్ణయింపగ నలవియగును। భవ॥ 20
సీ। ఆదికనాదివై ఆనందమయుడవై బరగు నీబయలందు ప్రథమమందు
సంకల్పరూపమౌ సగుణశక్తి జనించె అందునకంతంతకైదు జేసి
అందు వక్కొకదాని కైదైదుగా గూర్చి ఒప్పుగా యిరువదియైదు జేసి
యన్నిట దేహము యేర్పచియును మాయతను అట్టిదగు కాయమున జేరి
గీ॥ యిరువదారవ తత్వమై నిలచి జనుల। తనను గుణముల యందున
దగుల జేసి। తిప్పుచుండును మరిమరి దిగినకొలది। భవ॥ 21
సీ॥ అట్టితత్వములతోనైన దేహంబున ఆధారమున నీవు ఆదివగుచు
వశషసలను నాల్గువగు సకోణంబులు గల్గుపద్మముమధ్య గణపతియున
కాంచనవర్ణమై గగనసాదృశమునై ఆరువందలు హంసలందుకొనుచు
కూర్చుండునిలయమై కుండలిమూలమై పవనసంచారమై ప్రణవమయత
గీ॥ శుద్ధశక్తి ప్రధానమై సూక్ష్మమగుచు। వెలుగు వెలుగుల వెలిగించు
వేగమయ్యు। వెలసియుంటివి అన్నిట వేల్పవగుచు। భవ॥ 22

సీ॥ మరియును స్వాధిష్ఠమను చక్రమందున బభమయరల లసబరగు ఆరు
దళములమధ్య విధాతనామంబున రాజసగుణ మనురక్తిగూడి
మెరుపువర్ణంబున హంసలుఆర్వేలు ఆరగించుచును అకారమయుత
మూత్రపువాకిటమూలమై శుక్లము దరలించి జీవుల ధరణియందు
గీ॥ గలుగజేసెటిబీజమై గగనమయుత। వెలుగుచుంటివిగదఅన్ని వేళలందు
జీవులన్నిటియందును చిత్రముగను। భవవి॥ 23

సీ॥ నాభిదేశంబున నారాయణుండవై డఢణతథదధనపఫ యను
పదిదళంబులనొప్పు మణిపూరకచక్ర మధ్యమున ఉకారమయుతధవళ
వర్ణదేహుండవై వాసుకిపాన్పుపై బవ్వళించియు పాలవార్ధినడుమ
ఆర్వేలహంసల ఆరగించుచు నాల్గుముఖములబ్రహ్మకుమూలమయ్యు
గీ॥ వెలుగుచును జీవులకు అన్నివేళలందు। అన్నమొసగుచు నుందువు
మెన్నగాను। సత్వము సమానవాయుసంచారమునను। భవవి॥ 24

సీ॥ కఖగఘ ఙ్ఞచఛల్ గా మరి జఝఞటఠల నెడు పన్రెండుదళములతో అ
నాహత కమలంబునడుమ శంకరుడవై ఆర్వేలహంసలనందుకొనుచు
నీలవర్ణంబున లీలగా కుక్షి మకారంబునను ప్రాణగాలి మయాత
మానసనిలయమై మరితమోగుణమున మృత్యువుగూర్చుచుమోహకలత
గీ॥ పొందజేయుచునుందువు పుడమిజనుల। తృప్తి పొందగ నియ్యవు తో
లగనియవు। గలిగియుందువుజగముల కల్పములను। భవవి॥ 25

సీ॥ వరుస అఆలుగా బరగిన పదహారుకోణముల విశుద్ధకోనలోన
కంఠదేశంబున కావలియుండియు దేహివై నవరుచుల్ తెలిసికొనుచు
తిననైనవస్తువుల్ తినుచును వాటిని పంచకోశములకు భాగవరుస
నింపుచు జీర్ణించి నేరి రసంబునుగొంచు పిప్పినివిడచుచు బేలవగుచు
గీ॥ వెయ్యిహంసలనందుచు వేళలందు। సకలపనులనుచేయుచు చానన
నుచు। మెలగుచుందువు నీదుమహిమకు మేరగలదె। భవవి॥ 26

సీ॥ భ్రూమధ్యమున రెండు భూబీజంబుల ఆగ్నేయకమలమునందు నీవు
బిందురూపుడవయ్యు పొందుగ నిలచియు నాదముకళలతో రంధ్రములకు
కూటస్థమయ్యును కుడియెడమలనుండి వచ్చుచుపోవుచు స్వచ్ఛమయ్యు
కూడుసుషుమ్నాంతకోనలో నొకవెయ్యికుడుచుచు సర్వముగూర్చుకొని
గీ॥ మెలగుచుందువమేయమై మేటివగుచు। అందుకను రెప్పపాటు (యు
న్న అల అవిద్య। వదలునందురు జేర్చుదూవలనుతెండ్రి। భవవి॥ 27

సీ॥ వినువీధిపైయొక్క వెయ్యిదళంబుల వెలుగుమంటపములోపలను అష్ట
దళపద్మమునడుమ దనరుపీఠంబున్న భాను చంద్రాగ్నులపైన మంచి
మాణిక్యవర్ణమై మణిగణదీప్తమై శుద్ధాంత తేజమై చూడరాక
వెయ్యిహంసలగాంచు వేదాంత వేద్యమై మిరుమిట్లుగొల్పుచు మెరుపుతళు
గీ॥ బోలి వెలుగుచువటగదా లీలగాను। అట్టివిధివాడిగని అందు (కు
అరుగువారు। నిలచియుందురునీలోననిత్యముగను। భవవి॥ 28
సీ॥ దేవదేవోత్తమ దేవేశ అట్టినీ దివ్యతత్వంబు నే తెలియవలయు
తెలిసియు కనవలె తేటగానంతట తెంపులేకున్నట్టి దివ్యమహిమ
భువియందుదివియందు పూర్ణుడవైయున్న పురుషోత్తమాఖ్య నీపురము
యేదేశమందున యేదివ్యభవనమై యేహర్మ్యములతోడ యెక్కు (యున్క
వైన ॥గీ॥ వింతశృంగారములతోడ వెలసియంత। పరిజనంబులతో యంత
భద్రముయ్యు। యున్నదందును నాలోనయున్నదాని। భవవి॥ 29
సీ॥ ఎంతవాడవటంచు యెంచుచుని న్నేను ఎచ్చటనిలుపుగ ఎచటగొలుతు
ఎచ్చటనైవేద్యమిచ్చెద శరణని ఎచటను మ్రొక్కుదు ఎచటజూతు
ఎచ్చటధ్యానింతు ఎచట నీపరిచర్య మొనరించుదును పాదయుగముగని
ఎందుశయ్యనొసర్తు యాదిశేషునిగూర్చి ఆకాశమందువా అవనియం (యు
దా ॥గీ॥ అంతులేకనుయున్న నీయంతచోటు। యెంచుగనరాదు గాన నా
యందు నిలచి। వెలుగునినుగొల్చెదను అన్నివేళలందు। భవవి॥ 30
సీ॥ అటుయిటుయున నేలఅంత వెతుకనేల అంతుశోదన నేల అలయ నేల
వాదమాడగ నేల భేదము దగ నేల కామకోపన నేల కలతలేల
రాముపోదన నేల రచ్చచేయగ నేల నొప్పించగా నేల నొవ్వ నేల
పెచ్చుపెరుగ నేల బేలలుగా నేల హెచ్చుపూజలు అందు యిచ్చ యేల
గీ॥ వచ్చి హెచ్చియు మరి పుచ్చి వగవ నేల। వచ్చినందుకు నీసేవనక టు
చాలు। వచ్చినదివచ్చినట్లుగ యుంచజాలు। భవవి॥ 31
సీ॥ తలక్రిందుగానయ్యుతన దేహముననున్న హృదయపద్మముజేరి యూహ
ప్రణవమంత్రంబును ఘటియించుచును దానిపై కెత్తి అందులోపలను జేరి (చేత
మనసుచిత్తముబుద్ధి మరి అహంకారము అన్నిటజయమొంది లక్ష్యమంచి
మనసుయేకముజేసి యును దాని సేవించి మాటిమాటికి అట్టి మనసుతోడ
గీ॥ ధ్యాన మొనరించుచుండినదానియందె। మనసులయమొంది ఆపద్మ
మధ్యనున్న। విభునిగని అందె సర్వము వేడ్కగనును। భవవి॥ 32

సీ॥ కర్మలలో లేదు కారణంబుల లేదు నిర్మలుడైనవే నిన్ను జెందు
మతములలో లేదు వ్రతములలో లేదు మనసునిల్వకయున్న మమతబోదు
మమతబోకున్న యేమత మైనవ్యర్థ మేమమతబో యినఅన్ని మంచివగును
కోర్కెలవిడనాడి గెల్చినసుఖమగు కోర్కెలతోనున్న కోరుదాని
గీ॥ కుడువ మరిపుట్టుపుట్టినగుణము లెచ్చు । గుణముతో గూడియున్న ని
స్సాడనగు నె । గుణమువిడచినవాడె గాకొవిదుండు । భవవి॥ 33
సీ॥ అందిందుయనరాక యెందునుగనరాక నిండియున్నదిగ జానీకుమాయ
నీమాయవల్లనె నిర్మించబడెజగము నీవుబీజమ్మయ్యు నిలచియుండ
మాయనూడు గుణాల మగ్నులైయుండిరి బ్రహ్మవిష్ణుశివాది ప్రభృతులేక
మాయదాటగలేరు మనుజులెక్కియనైన మాయగెల్చిన నీవుబయలునందు
గీ॥ ఐక్యముచుబొందియుందురు అదియువిడచి । మారుకల్పంబులకు నైన
మరలిజన్మ । మూలకు రాబోరు దూయను మెలగబోరు । భవవి॥ 34
సీ॥ ఆది నిబంధులున ఓంకారశబ్దము తనకయ్యె తాగల్గె తత్త్వముంబు
తనరమయ్యెనైన తత్త్వబద్ధమున గుణమయమ్మైన మాయమ్మె మసలుచుండె
సగుణశక్తి యనుటన్న సంకల్పమున్నను యొసగ అవిద్యమాయయనఅదియె
అందునగలైను అఖిలగుణంబులు గుణములజగమయ్యె గుర్తులిగె
గీ॥ గుణయుతంబైనశక్తి నిర్గుణమునందు । అగుటచే నీవు సమమయ్యె
అంతజేసె । నీవు అందింనులనుగూడి నిలువగలవు । భవవి। 35
సీ॥ ప్రణవాక్షరంబునబలుకుశబ్దముమిన్న అవుమ యని అలరుఅందు ముందు
నడచు అకారమే నలువయైజగముల సృష్టించుచుండు రజోగుణంబు
చేత వుకారమే శ్రీకృష్ణుడై పోషణమొనర్చుచుండు సత్త్వమునదనరి
తలప మకారమె తామసగుణమునశివుడయ్యెలయమును జేయుచుండు
గీ॥ మూగురుమూర్తులు ఆశబ్దమూలమున నె । ముందుగల్గిరి జగములమూ
లమైరి । నకట అక్షరమున అంతవప్పియుండె । భవవి॥ 36
సీ॥ అంకుమూలమునసే అఖిలవేదంబుల ఆదిని ప్రణవంబుఅలరుచుండె
సర్వమంత్రంబులుసర్వయంత్రంబుల మొదటనుఓంకార మొప్పియుండె
ఓంతత్సదితియని అర్జునునకుజెప్పె గీతలలో దేవకీసుతుండు
ఆర్యులెల్లరు వేదఅభ్యాసమున శుభాశుభకర్మలందును శుభముగోరి
గీ॥ ఆదిగణపతిపూజన్న అర్థమదియె । సురలు అసురులు దానినే చూ
చుచుండిరి । అదియె సుఖముని నాకిచ్చె ఆర్యుడాది । భవవి॥ 37

సీ॥ శివుడు అయ్యెర మే సేవించుచును తాను పార్వతికిని చెప్పె భద్రమనుచు
శ్రీరామచంద్రుడు సీతయు దానినే బోధ జేసిరి వాయుపుత్రునకును
తారకంబదెయని తరచియు సూతుడు శౌనకులకు జెప్పె శాస్త్రములను
శుకునకు వ్యాసులు సుఖతరంబని చెప్పె శుకుడును అభిమన్యు సుతున
గీ॥ వుపనిషద్వాక్యములలోన వున్నతమగ । అదియె జెప్పెస్థిరమని (కొసగి
అఖిల ఋషులు । అట్టి ఓంకారమే నీవు ఆదిపురుష ॥ భవవి॥ 38
సీ॥ శ్రీరామచంద్రుడు శివుడె దేవుండని సేవించుచుండెను చిత్తమునను
శ్రీ మహాదేవుడు శ్రీరామచంద్రుడే ఆదిమూలంబని ఆత్మదలచి
పూర్ణసమాధిని పూజ్యుడై సర్వదా రామతారక మనురక్తితోడ
సేవించుచుండెను శ్రేష్టులందెవరగు శంభుడా లేకను చక్రధరుడ
గీ॥ చేరిచూడంగ రాముడే శివుడుయగును । శంకరుడె రామచంద్రుడా
శంక లేల । రామశివులకు మూలమా జపదము । భవవి॥ 39
సీ॥ ఆదిశేషుండను అహిరాజు తనువుపై శయనించియుండెను చక్రధరుడు
ఆపాన్పుపై జేరి అవని శ్రీహరిపాద సేవ జేయుచునుండె చెలగియపుడు
నగలుగా దాల్చెను హరుడుఆపాము నే భూమినిఆపామె మోయుచుండె
అవనిక్రిందిగువను అలరెడు ఆపాము పాన్పుగా నగలుగా బరగుటెట్లు
గీ॥ అవని ఆపాన్పుపై జేరి అలరుటెట్లు । అన్ని నిజమను టెట్లు లేకన్ని సున్న।
యనుటయెట్లు నీ మహిమలు గనుటయెట్లు॥ భవవి॥ 40
సీ॥ నన్నుసేవించును హరునిపై ద్వేషము బూనిదూషించిన భూతనాథు
భక్తియొసర్చును మరి నను ద్వేషించు వారలైనను ధర భానుచంద్రు
లున్నంతవరకును యెన్నగాయుందురు యమపురిన నెచు శ్రీహరియుమరియు
నారాయణునకును నాకు భేదములేదు యనిపల్కె హరుడును అంబతోడ
గీ॥ జీవులందునే భేదము చేయరాదు । అట్టిచో శివకేశవులందు భేద ।
ద్వేషములుబూన యేగతో తెలియదయ్యె । భవవి॥ 41
సీ॥ అద్వైతమతమును ఆశ్రయించగవచ్చు హరిభక్తుడైయుండియురయవ
చ్చు। యతియయ్యెమఠమున సతతముండగవచ్చు బ్రహ్మచర్యవ్రతంబు
బడయవచ్చు। ఆలుపిల్లలగూడి ఆనందముగయింటి యందు నుడంగ
వచ్చునందు జపము। తపముసల్పగవచ్చు దానధర్మంబులు సనవంబులును
బహుసలుపవచ్చు ।గీ॥ యేది జేసినమనసుజయించ రాదు. కోర్కె లేకుండ
వలెమరిగుణము లేని। మనసుగావలె నినుగనమాన్యచరిత। భవవి॥ 42

సీ॥ మాయగారడివాడు మన్ను చేతనుబట్టి మూసి తెల్లగజూపు భాసురముగ
భూతవైద్యుడు వెనుభూతరోగినిబట్టి బెదరించిబహుకళల్ జేల్పినటుల
పిల్లియు పిల్లల పెకలించి యిల్లెల్ల దిప్పిన బహుయిండ్లుదిప్పినటుల
మనసు అనేకమౌ మమతలలోదూరి ప్రీతినియమంబున హితవుగాను
గీ॥ తనువువిడచియు తిరుగును తలపులందు । గాలికన్నను వడిగాను కల్ల
పనుల । మనసుపట్ట నసాధ్యమౌ మునులకైన । భవవి॥ 43

సీ॥ అఖిలభూతాత్మక ఆనందముగనిన్ను అర్చించుచుండినఅంతలోన
మనసంతులేక నే మగువలపాలిండ్ల ఆనందమాడంగ అరుగునదిగ
పరుగెత్తు మరిమరి పరధనంబులుగోన దేశదేశంబులు తిరిగివచ్చు
వడివడిగాబోవు వాడవార్తలువిన మరలించుదామన్న మరలిరాదు
గీ॥ యెట్లుపట్టుదమన్నను యోచరాక । విసుకులేక నెబోవు ఆవెర్రిమనసు।
ఔర బహుజాణ అదిగెల్వ అలవిగాదు । భవవి॥ 44

సీ॥ యొకటమాట్లాడుచు సకలమౌచోట్లకు వెళ్లుచువక దానివినుచునుండు
యొకపనిచేయుచు అకటబహుపనుల దలపెట్టుచును వేరువలనుజూచు
వంచనలందుచు వలపులగులుకుచు తూగాడి వెలివానిదూరుచుండు
యింటఁబోరుచును వేరింటసంతోషించు రెంటకలతలాను అంటితిరుగు
గీ॥ తుట్టతుదకెట్టులేగో కన్పట్టరాదు । పట్టికొట్టుదమన్నను వట్టిదగును
మనసుమర్మంబు తెలియదేమాడికైన । భవవి॥ 45

సీ॥ వద్దజేరగలేదు గుద్దులాడాలేదు రద్దులెన్నోగూడు ముద్దుగాను
సద్దుసేయాలేదు హద్దెరుంగాలేదు దద్దిమానాలేదు హద్దుదాటు
గద్దెలెక్కాలేదు ముద్దుగుల్కాలేదు మొద్దుగానూలేదు బద్దగించు
మద్దెరుంగాలేదు చద్దితినలేదు యెద్దుగానూలేదు పెద్దగాదు
గీ॥ కుద్దునను జేరలేదు యేపద్దుగాదు । ముద్దగమువదు యెవ్వాళ్లు మొత్తు
కున్న । యెద్దో మొద్దానో మనసనయెట్టిదగునో । భవవి॥ 46

సీ॥ యెంతజెప్పినగాని యెరుగదు నామన్సు వింతవింతలుగన వెళ్లివచ్చు
పిచ్చిగంతులువేయుయిచ్చయిచ్చగమరి ఎచ్చటికేగునోఎరుగరాదు
రచ్చలకేగును రాజులజూచును మురియుచునుండును ముచ్చటించు
అచ్చంపుబల్ తుర్కుమెచ్చినమొనగాడు సచ్చరిత్రముగాదుచానదెప్పుడు
గీ॥ యిచ్చవచ్చినరీతి బోగిస్పునయ్యా । మచ్చికయుజేసిగనరాదు మరువ
రాదు । మనసు యౌదార్యమెరుగంగ మనుజులెవరు । భవవి॥ 47

సీ॥ పుస్తుదున్నట్లుగా పుండనీయగబోదు. ఎన్నాళ్లయున్నచో [illegible]చుండు
వచ్చినదనియేమి వక్కటి తెలియదు యెచ్చువిద్యల నెన్ని యెన్నుచుండు
నిచ్చోవ లెక్కను నిక్కయుచూచును నిధులువార్ధులుగను నిండియుండు
నిదు రెప్పపాటులో నిజముకానైయుండు పిలచినపలుకదుపిద్దిగాదు
గీ॥ యింటిలోనుండబోదు యేఘంటయుందో । కుప్పగాల్చియు మరియుక
కుప్పకేగు । మనసుగనిపట్టగారాదు మనుజులకును । భవవి॥ 48
సీ॥ అష్టాంగ యోగంబులభ్యసించగబోను నిష్టసిద్ధులుగను యిచ్చజేయు
దుష్టసాంగత్యము తొలగియేయుండును నిష్టగానిల్చును నింగికెగురు
అష్టమదంబుల కవ్వలమైయుండు కష్టము లేకుండగాంచు గురుని
అట్టిట్టులనుబోక ఆనందమైయుండు చెట్టుమీదికినెక్కి సమసిపోవు
గీ॥ అప్పుదీరినఅప్పుడే చెప్పకేగు । అటమిపట్టిన యుండదు అలపిగాదు ।
మనసుమహిమల నెరిగిన మనిషిగలడె । భవవి॥ 49
సీ॥ యెంతని చెప్పుదు యేమనివర్ణింతు మనసుమహిమలెల్ల మానవీయ
కవియగు రవియగు కాలకంఠుండగు కల్పంబులుండును కదలుచుండు
వక్కటిగానుండి పెక్కండ్లుగూడు వక్కదానంమున చిక్కబోదు
వన్నెయెన్నగరాదుసున్నయునుంగాదు అంగవిహీనుండు లింగమూర్తి
గీ॥ యేడుగుర్రాల రథమున నేగుచుక్క । పదియు రెండిండ్ల మధ్యలో
కండి గదిసియుండు । వెర్రిగాబోదు వేదాంత వేద్యుడతడు ।భవవి॥ 50
సీ॥ పదియుంద్రియములకు ప్రభువుగానుండి యేకాదశేంద్రియమనగాను
వెలయు । ననియు శ్రీకృష్ణుడు అర్జునునకు జెప్పె గీతలయందున కేవలాత్మ
విధులును స్మృతులలో విరివిగా జెప్పి మనసుజయించనే మార్గమైరి
ఏకాదశినెరింగి జోకతో వుపవాస ముంచినవారలే మునులనంగ
గీ॥ అట్టి యేకాదశినిపట్టి గట్టిగాను । ద్వాదశదళంబులందున దనరుశివుని
ఐక్యమొనరించ సర్వము అందనగును । భవవి॥ 51
సీ॥ అదియెట్టులన్నను అమనసవెల్లిన దశమిని వకపూట దగభుజించి
వక్కపొద్దుండియు వప్పుగా యేకాశి నిశిని జాగరణంబు నియతిజరపి
ద్వాదశిదినమున దనరి పారణజేయ శ్రీవిష్ణు పదమని శ్రేష్టమనుచు
చెప్పె వేదములును చెలగి పురాణముల్ గోప్యముగాజేసి గుర్తులిట్లు
గీ॥ సూత్రమెరుగరు అర్ధముచూడబోరు । చెలగి యేకాదశీనిష్టచేయబోరు 52
యెట్లు పట్టిగ మనసు జయించనగును । భవవి॥

సీ॥ రుక్మాంగదుండదే రూఢిగాయొనరించి తనదేశప్రజలను దనర జేసె
అంబరీషుండదే ఆచరించెనుమరి ప్రహ్లాదుడొనరించి బాల్యమునను
చిక్కడెంపనయని చెప్పెనుతనజాతి శిశువులకును తన్ను జేరితండ్రి
తగదనిదండింప తగులక వగవక సాక్ష్యముజూపెను స్తంభమునను
గీ॥ ధృవుడుయొనరించి నిలచెను ధృవపథమున । నిజము తెలిసియు నిను
గొల్వ నీరజాక్ష । అపుడుయుండినవాడవు యిపుడు లేవ । భవవి॥ 53
సీ॥ అల్లామహమ్మదు అద్దానిసేవించి తెలిసి యేకాదశి తెల్లవారు
ఝామున స్థిరమగు సాయుజ్యమునుగనె మరి ధర్మశాస్త్రముమమతతోడ
వ్రాసియు తనజాతివారికిబోధించె నమవక తప్పిన నరకమనియె
వుత్తరదిశ రాళ్లు వుంచగా తగదని మక్కామసీదులో మస్తకమును
గీ॥ వైచె యెదురయ్యె నీధర్మనైభవముకు । తెలియసాధ్యముగాదది
తెలిసివాసి । భక్తులెందరు నీదివ్యపథముగనిరొ । భవవి॥ 54
సీ॥ మూడిటి హెచ్చించి మూఢత్వమభివృద్ధిగావించిబహుకల్తగలుగజేయు
సంకరకార్యముల్ సనుకూర్చియెక్కువ చింతలులోగూర్చి చిక్కుపెట్టు
మత్సరంబులుగూర్చు మత్తవైరములదించు వాదంబులాడించు వంగజేయు
క్లేశములన్నిట కేకలు వేయించు రోషంబుదించదు రోతచేయు
గీ॥ వలనుగా నెన్ని బుద్ధులో వర్తిలంగ । జేయుచుండు అజ్ఞానమ్ము చెడ
తమము । దాటిఅణచంగ నేరరు ధరణిజనులు । భవవి॥ 55
సీ॥ భూతంబులనుదిట్ట పోసగించుచుండును బుద్ధిమాంద్యము జేయు పుడమి
యంత । రాగంబుతీసును రంజిల్లనివ్వదు రానివ్వకుండను రచ్చజేయు
నిత్యమనిత్యమా నిజవస్తుతత్వము యెన్నగానియ్యను వున్నతముగ
శమదమాదులనెంచి సాధించనివ్వదు శాశ్వతానందంబు సాగనియదు
గీ॥ హింసజేయించు హంసలనెంచనివదు । యెంతపుణ్యాత్ములైనను సంత
తంబు । గెలువలేరుయజ్ఞానము కేవలముగ । భవవి॥ 56
సీ॥ దానధర్మంబుల తలపెట్టనివ్వదు చేయువారల నిందజేయజేయు
మును తనకుపకారమును జేసియున్నట్టి జనులకేకీడును సలుపజేయు
పరనిందజేయించు పామరత్వముబెంచు దీనులదండింపదించుమరియు
అనృతంబులాడించు అపవాద మొరులపైబరగించి బాధింపబంపుచుండు
గీ॥ జూదములపేర్మిగల్పించి చోరగజేయు । యెంతఆశ్చర్యమో మది
యెంతమహిమొ । తెలియరాదు యజ్ఞానము గెలువరాదు ।భవవి॥ 57

సీ॥ లోభ మెక్కువ జేయు లోగించు దొరలకు దండగ ల్బెట్టించు తాపము చ్చు
తన తావు తెలియక తన్నుండగా జేయు తనను తా భూషించుకొనగ జేయు
శృంగములను గూర్చు సుగుణము సడలించు వలపుల వలపించి మెలగ జేయు
రోఖ మెక్కువ జేయు రొండోదిగస జేయు మున్నున్న దాని నేమన్న జేయు
గీ॥ అంద్రియుండు నతన్నది అన్ని పనుల । అందియుండియు తనకది అంద
బోదు । గనియు వర్ణించ రాదు యజ్ఞానమహిమ । భవ॥ 58
సీ॥ అందింపయును గాక యొదునోయన గాక వంట నేయుందు యెవ్వారికైన
రూపంబు లేనిది రూఢిగా గనబోతె వోపిక గలదది మాపు రేపు
సున్న గానీయకు యెవ్వాళ్లకైనను చురుకుగా నుండును చూరగొనును
యింటిలో నేయుండి యిల్లెల్ల జేరచును ఆధారమైయుందు అవనికెల్ల
గీ॥ యెంత వేడినగాని చోటింతయీదు । యెప్పుడు పోరు నుండును
యెడము లేక । అలవిగాదు అజ్ఞానము ఆలియెప్పుడు । భవవి॥ 59
సీ॥ యింటిలో పలపోరు యీదజాలక హరి దారుకూపంబును దాల్చియుండె
యింటిలో పలపోరు యీద లేక హరుండు లింగరూపు డయ్యె నింగికెగసె
యింటిలో పలపోరు యీద లేక యుముండు ఒకకాలు అగ్నిలో నుంచియుండె
యింటిలో పలపోరు యీదజాలక జీవు డిల్లు దిరుగుచు వెళ్లుచుండె
గీ॥ యింటిలో పోరు యన నది యెట్టిదగునొ । యింటిలో నున్న ఆయింతి
యెట్టిదగునో । దానిజాడను తెలియగాదగదు తగదు । భవవి। 60
సీ॥ యింటిలో పలిఆలు యింత జేయుచునుండ వెలిఆలు బాధేమి వేధ జేయు
యింటిలో పలిఆలు జంట బాయక యుండు అవనిపై తానున్న అంతవరకు
అదితన్ను విడచిన అపుడె తానుండగ తావు యుండగబోదు తానె లేదు
అది లేక యుండిన అపుడె లోకము లేదు అదియున్న జగముండు అన్ని యుండు
గీ॥ తెలిసి విడువగ రాదది తెలివితోడ । తెలసికొనినను అప్పుడే తెగును
అట్టి । తెలివిగూర్చి యజ్ఞానము తెంపుమయ్య । భవవి। 61
సీ॥ యిల్లెల తానాయెనిలు వెల్లవిష మాయె నిజము కానిది ఆయెనిక్కడాయె
వచ్చిపొయ్యేదాయె చచ్చేది కాదాయె నిలచికన్గొనినను నిల్వదాయె
నిన్నరుంగుదమన్న నిముష కాలంబైన నిలువనీయవిదాయె నీదెఆయె
మున్ను నీలో బుట్టి నన్ను జేసినదాయె నీలోను లేకయే నాలోనిలచె
గీ॥ లీలగా కల్పనయొనర్చి లెఖ లేని । చిక్కులను బెట్టుచున్న ఆచిన్ని మాయ
దాటగా మనుజులకెట్లు తరముగాదు । భవవి॥ 62

సీ॥ ఎరిగి దాటుదమన్న ఎరుగనీయదు మరి పెరుగ జేయు నెగాని విరుగనియదు
నిజధర్మములయందు నేరమెంచగ జేయు కాని వేషమని బూనజేయు
లంచమిచ్చినగాని మంచ్మెక్కనివ్వదు మచ్చిక జేసియు మచ్చు వేపు
మున్నాళ్ళ ముచ్చటల్ ముగిపించు హెచ్చుగా వన్నె రానియ్యదు వసధిముంచు
గీ॥ అన్న నీమాయ చిత్రంబులెన్ని గెలువ । అలవిగాదు నీకరుణను అంద
కున్న ।అద్ది దయచేసిబ్రోవవే ఆదిపురుష । భవవి। 63
సీ॥ పరమార్థతత్త్వము నెరుగదలంచిన మరపించు అణవమలము దాని
గురుని జేరియు వేదశాస్త్రము తెలిసికొనునపుడు అయ్యర్థమును మనబుద్ధి
జొరగనీయక చేయుచుండు కార్మికమల మనునది మాయేయమ నెడుమలము
పాపకార్యములందు బరగించి బుద్ధిని గాఢ మజ్ఞానము గలుగజేయు
గీ॥ మాయికమలంబు నీలనీయు మూపు రేపు । ఆత్మనెరుగంగనియ్యదు అరసి
యిట్టి । వెల్లమెటు దాటతరి నాను వేదవేద్య । భవవి॥ 64
సీ॥ సత్యమగు పరమేశ్వరుని యందు అసత్యమైన భానంబు సమ్మతము గాగి
గలుగజేసియు మరి అలపరమాత్ముని తెలియగానియ్యక గలతలొలుక
జేయుచునుండును చెలగితి కోదానమలమును సదిచాలమత్సరించి
వలనుగా యిటుయెన్నో వర్తిలుచును నాహు చిత్తమున్నప్పుడు చెరచుచుండె
గీ॥ జన్మమాదినియిక అన్నిసంచిలోను । చేప్పుకొని పుట్టితినో మధ్య చెంది
నానో । తెలియజాలను సర్వేశ దీనవరద । భవవి॥ 65
సీ॥ తనువునఆమాయ తనరు యేదక్కున యనివిచారించిన అచలుడైన
పరమేశ్వరునియందు ప్రతిఫలించిన మాయ ప్రతిబింబమగుచు ఆ పరముదున్న
పట్టున నేయుండబమనిరి పెద్దలు పరమేశనీలో రాబడిన మాయ
నీవున్న చోగాక యికయెటయుండును నీవున్నతా వెవ్వాహించవలెను
గీ॥ తనుటతుదియందు ఘనముగాక దలుచున్న । చాయయే పరమేశ్వరు
చాయయనిరి । ఆత్మవేత్తలునిన్నందు అందిపొంది । భవవి॥ 66
సీ॥ అటుగాన ఆమాయ కుటిలకుంతలియయ్యు కన్నులతుదియందు కదలు
చుండు । చకచకలాడుచు సకలజీవులయందు అమూలంబునై యుండరాక
కన్నులలోనకనుపడియును గానబడని స్వరూపమై బరగుచుండు
అట్టి మాయను దాటి అచలమై వెలిగెడు చూపులేపరమాత్మ రూపమనుచు
గీ॥ లోనిదృష్టిచె నెరిగి నిరూఢమైన । జ్ఞానరూపంబు నొందియు గలత
వదలి । నిర్మలుండైన నీయందె నిలువనగును । భవవి॥ 67

సీ॥ యిల్లువాకిలి నాదియిల్లాలుయును నాదియిలనున్న వన్ని నాయింటనుండె
నేఘనుండ బలుండ నేను విద్వాంసుడ నేధనాధికుడను నేసురూప
వంతుడ వైరాగ్యవంతుడ నెక్కువగుణవంతుడను సత్కులమువాడ
బహుసుఖవంతుడ బంధువుల్గలవాడ యయ్వనవంతుడ నెచ్చురాజ్య
గీ॥ పదవిగలవాడ నాబంధుపరిజలునన్ను । అధికముగ గౌరవింతురు యను
చు బలుక । చేయుచుండు అహంకార చెడ్డతనము । భవవి॥ 68
సీ॥ నేను కోరినవెల్ల నెరవేరుచుండును నేర్పుగల్గినవాడ నిఖిలగుణుడ
యందరింతులనైన పొందుగాభోగింతు మందుమాకులు లేక మరపుకొందు
భగవంతుడైనను భయపడును నను జూచి పరుగెత్తుచుండును బలము యుడిగి
నన్నోంచుకొన లేరు యెంతధీరులునైన నేబల్కుకుండిన నిలువబోరు
గీ॥ నేను గదయింత జేసితి యిూకమీద । యెంత జేతునో చూడుము నా
తమాష । యనుచు మదవదరు యహంకారయినసుతుండు । భవవి॥ 69
సీ॥ కాలచక్రంబెల్ల కడతేరు నను బాసి కదలదు మెదలదు కలుగబోదు
కనరుబోతును గాదు ఘనతనెన్నగబోదు గనబోదు గజిబిజిగానుబోదు
అసలెయుండగబోదు మిసిమిగా నేరదు వసవసాలేటికి వదలబోదు
వినబోదు నవరుచుల్ కనబోదు తినబోదు వగవదు నగువదు తిగులబోదు
గీ॥ నావలన సర్వమును అయ్యు నడచుగాని । నేను లేకున్న మోదిగా నేరదను
చు । కేళిసల్పు అహంకార పాశిగాడు । భవవి॥ 70
సీ॥ ఆకాశమున గల్గు ఆఖరుతత్వము ఓయహంకారము అధికమగుచు
జీవులయందుండ జేరెయుస్థిరముగా నేను నేనన జేయు హితవుగాను
నేను నాదనకను యేవేళలందైన యుండరు యతులైన యోగులైన
నేబోక యును లేదు యేసుఖమ్మైనను నేబోవు విధము నే నేర్చుకొనరు
గీ॥ నేవిడువ లేదు యేదియు నిజముగాను । నేను విడచుట యెట్లొ నిన్నెరుగు
టెట్లో । తెలిపి తెరదీసిబ్రోవవే దేవదేవ । భవవి॥ 71
సీ॥ నాయెన్నటికిగూడ నాశముగాబోదు కాయమువున్నంత కాల ముందు
కాయము విడచిన కలదో లేదో దాని గమనించగారాదు గడువరాదు
జ్ఞానదూరంబగు గాక జననకారణమగు బాయదు శరణన్న గాని
వనములకేగిన వార్ధులదూరిన నాయనుచు నెయుండు నాదికాదు
గీ॥ నాయనెడు వస్తు వేదియు నెరుగరాదు । దేహమో లేక జీవుడో
తెలియరారు । విడువగను రాదు దేహము విడుచుదాక । భవవి॥ 72

సీ॥ కాయమేనాయన కదలుశక్తియులేదు జీవుడన్నను యందుజేరితలుకు
జీవుడులేకున్న చెల్లదు దేహము జీవుడుమేనేక జేయలేడు
అలరు రెండిటనన్న అది యేకశబ్దమా అందుచే రెండిట అందబోదు
యిక యెందునను జెందినిలచునుయనిచూడ ముందుకర్మమునను బూనిదేహి
గీ॥ కాయమునకేరెగాన ఆకర్మయందె । నిలచు నేననుశబ్దముతలచిచూడ
దేహి దేహములనులేక దేవదేవ । భవవి॥ 73
సీ॥ కర్మబ్రహ్మంబని కాలముయగునని పెద్దలందురు నీను సుద్దులందు
అట్టిన నీవయ్యెఅలరెడు ఆకర్మ నీవెయిత్తువుగాన నిన్నుజెందు
నేనునీవనునది నిలచియున్నట్టిది యెవనిచేగల్గెను యెవడునడుపు
చేసినవాడేల చెట్టునునరుకును నీవుజేసినచెట్టు నీవెనరుక
గీ॥ తగదుయనితప్పదోయగా దాతయెవడు । కర్మచేయించ తొలగించ
కర్తనీవె । యగునుగావున బాపుము అట్టికర్మ । భవవి॥ 74
సీ॥ కర్మదేహంబిట్లు కలుగజేయగనేల నిర్మలుడనదేహి నేచనేల
దుర్మతియునుగూర్చి మర్మమెంచగనేల మనసునిల్పియుజూడమనగనేల
ముందునీలోనుంచి యిందుబాపగనేల అందించలను నీవె అరయనేల
సర్వమున వకబుద్ధి పాధించమననేల ముక్కచక్క నయుండిమురియనేల
గీ॥ యింతజేసియు కడకును యేదిలేక । రమ్మనగనేల నీయందెరక్తిగాను
యుంచుకొనియుండగూడదా యోగివంద్య । భవవి॥ 75
సీ॥ కాపాడవేమిరా కళ్యాణవిగ్రహా! పాపలలోనున్న పరమపురుష
తాపముదీర్చరా వోపికనివ్వరా మాపునేపనరురా పాపలత్తి
చూపులనిలుపరా లోపముల్ దిద్దరా రూపంబుదీయరా సాధిగాను
మనసునునిల్పరా మర్మంబువిప్పరా మాయతెరనుదీసి మరునజేసి
గీ॥ విమలమైన సుషుమ్నాంతవీధియందు । వింతయుండిన వెలుగుల అండ
జేర్చి । తలపునిలుపుము నీయందెనిలుపుమయ్య । భవవి॥ 76
సీ॥ తెలుపులోపలనిల్పు తెలివిని తెరుగించి తెలివిని తెల్పులోనిలుపుమయ్య
వెలుగులోపలవెల్గు వెలుగుయర్థమువిప్పి వెలుగులో వెలుగున వెలుగజేయు
కన్నులలోనున్న కళలకల్తులుమాన్పి కళలోను నిష్కళాకళనునిలుపు
వలపులచెలికాని వలపులమలపియు తలపులో వలపుల గుట్టుగూర్చు
గీ॥ తలచు తలపుల వెలుపల తలుపుదీసి । తలుపులోజేసి తలపుల తలగ
ద్రోచి । తలపునిలుపుము నీయందెనిలుపుమయ్య । భవవి॥ 77

సీ॥ వేదాంతవేద్యమై వేదస్వరూపమై వేదముకందక వెలుగుదాని
వేదమూలంబయ్యు వేయిపణములమధ్య వెలయు వేదికమీద వెలుగుదాని
నీలమేఘముమధ్య లోలతమాడ్కిని మెరయు మెరుపుబోలి మెరయుదాని
అణువులో అణువునై అధికసుందరమునై ఆనందమయమునై అలరుదాని
గీ॥ వెలుగు వెలుగులఅన్నిట వెలయుదాని । ఆదిమధ్యాంతశూన్యమై య
లరుదాని । అందజేసి యీ ఆనందమందెనిలుపు । భవవి॥ 78

సీ॥ అందమైహృదయారవిందమందిరమధ్య సుందరంబైమునిబృందములచె
వందనీయంబునై వర్ణనాతీతమై విమలమై శుద్ధమై వేద్యమగుచు
వసుధకాధారమై వైభవాస్పదమునై విష్ణుపథంబునై విదితమగుచు
కుండలినిలయమై మండలాకారమై మార్తాండసదృశమహామూర్తియగుచు
గీ॥ నుండియు అఖండమగుచును నోజ్జయగుచు । పండువెన్నెలబయలునై
దండిదగుచు । నిండివెలిగెడురూపము అండజేర్పు । భవవి॥ 79

సీ॥ అందజేయవె నీకు సుందరపాదముల్ వందితానందగోవింద వరద
అంది అర్చనజేసి ఆనందముగ పాద తీర్థపవిత్రముల్ తీర్చనియవె
మందిరంబున జేరి పొందుగా నీరూప మందిపొందియుసుఖమందనియవె
ముందుజేగియు భక్తివిందుజేయుచు నీవు అందించు శేషములందికొనుచు
గీ॥ మూడువిధుల ప్రసాదముల్ మోదమునను । గుడిచి తృప్తినిబొంది
నిన్నూహి నిరుప । మానమైన ఆనందము బూననియవె । భవవి॥ 80

సీ॥ అండాండములునీవుపిండాండములునీవు బ్రహ్మాండములునీవుబ్రహ్మనీవు
కాలంబులునునీవు కల్పంబులునునీవు కల్పకోట్లకునైన కదలబోవు
అవతారములుదాల్చి అలరుదునటుగాక యుందువుస్వేచ్ఛగ అందునిందు
అఖిలంబులోపల అంటియుంటివిమరి అఖిలంబునీలోన అంటియుండె
గీ॥ ఆదివిగదయ్య సముడవైఆత్మమయత । సచ్చిదానందమయమగు స
త్ప్రకాశ । మమరసాక్షాత్కరింపవే అమరవినుత । భవవి॥ 81

సీ॥ గుణములచేత నీగుర్తుగా రాదు గుణరహితుండవు గుణుడవీవు
తర్కవాదనచేత తరచి తెల్యగరాదు సత్తుగావు మరి అసత్తుగావు
భిన్నముగావు అభిన్నమునుగావు భిన్నమభిన్నముయున్నుగావు
అవయవంబులు లేవు ఆకృతిరహితుడవౌ అన్నియుండినవాడవున్న మరియు
గీ॥ తెలియ చిదచిద్విలాసవర్ధితుడవగుచు । జ్ఞానతర్కంబునను తెల్సి
గాంచదగిన । వాడవగుదువు భూతనివాస శౌరి । భవవి॥ 82

సీ॥ విద్యఅవిద్యల వెలసియుంటివి సాక్షివై ద్వంద్వరహితుడవయ్యు మరియు
సదసత్తునుంగావు సావయవము నిరవయవమునుంగాని వైభవుడవు
సకలకార్యంబులు స్థావరజంగమాదులనెల్ల జేసిన తొలికఃభుడవు
బలహీనుడవు మరిగలదింతబలమని తెలియశక్యముగానిధీరుడవును
గీ॥ ఆత్మకును కారణతనువుఅయ్యువెలుగు । విమలపరమాత్ముడవును అ
భేద్యుడవును । నీవెగదవయ్య మమ్మేలునిర్మలుడవు । భవవి॥ 83
సీ॥ అంతరాత్ముడు కనుల అగుపడుచున్నాడు అభయుడై సుభబోలివిభవ
ముగను । కన్నులనంటక కదలుచున్నాడు కంటిలోనీళ్లుచకంటికవియు
అంటక వెడలెడునట్లుగా నీవెప్పుడయ్యును కనులయుండ గనుబడెను
జగతికిపూర్వము స చలించకయుండి అపరమాత్మనే అవ్యక్తముగ
గీ॥ పుట్టగాజేతుజగమువి మొట్టమొదట । తలచెతలపును తనలోన తనకు
దాని । అట్టియిచ్ఛను కారణమాదియన్న । భవవి॥ 84
సీ॥ ఆయిచ్ఛచేగల్గెఅవ్యక్తమును దాని యిచ్ఛచేసగుణుడై యీశ్వరుండు
బరగె ఆతనిగర్భమునందు మాయజనించె మాయచేఅహమయ్యె మరియు
అహము । పుట్టునగల్గెను పంచతన్మాత్రలు పంచతన్మాత్రలపంచభూత
ములును గాబడె అంనుమూలంబునను సర్వ జగములు గల్గెనుఅగణితముగ
గీ॥ బరగెయీరీతిగను ప్రపంచసృష్టి । యిట్టిసృష్టివిధంబుగన్పట్టలేక
మాయగుణముల మగ్నులై మనుజులుండి । భవవి॥ 85
సీ॥ గగనమనునుగల్గె కామముక్రోధముభయముమోహాములజబరగనైదు
నరములుచర్మముయెముకలుజట్టునుమాంసము ఐదుగాబడియెధరణి
వలనను మరిఅగ్నివలననిద్రయు రతి ఆలస్యము దప్పి ఆకలియును
అయిదుజనించెను అప్పుగుణంబున శుక్లము రక్తము చొల్లు చమట
గీ॥ మూత్రమును ఇవ్వి ఐదునుపుట్టె మరియు । వాయువునగల్గె పారుట
వణకుటయును । కంపమొదుట నీల్గుట కనుట ఐదు । భవవి॥ 86
సీ॥ భూతహంశలుపైకి భూతవిషయములు వివరింతుయికమీద వేరువేర
శబ్దమొక్కటి ఆకసంబునగల్గెను హంకారయుతమునై హుంకరించి
శబ్దము స్పర్శముజనియించెగాడ్పుచే ఘునక్రియాశక్తి అకారమునను
పైరెండురూపముల్బరగె అగ్నిని జ్ఞానశక్తిరకారమై బరగుచుండ
గీ॥ జలమునను శబ్దరూపము స్పర్శ రసము । లగు మకార యిచ్ఛాశక్తు
లందు అవని । గంధముతో ఐదుగల్గె లకారమునను । భవవి॥ 87

సీ॥ పాణిపాదంబులు పాయువుపస్తవు వాక్కులు పుట్టెను వసుధయందు
జలములగల్గెను శబ్దముస్పర్శము రసగంధరూపముల్ రమ్యముగను
గలిగెను అగ్నిచే కన్నులు చెవులును చర్మము నాలుక చెలగి ముక్కు
పవనునిచేబుట్టె ప్రాణ అపాన సమానము వ్యాన వుదానములును
గీ॥ గగనమున మన్సు చిత్తము జ్ఞాత బుద్ధి । యును యహంకారమనునది
యుద్భవించె । అన్ని యిరువదియైదయ్యె ఆత్మతోడ । భవవి॥ 88

సీ॥ అగ్నిభూమియుగల్సి అయ్యెఅహంకార మగ్నిజలంబులులగ్నమైన
చిత్తముపుట్టెను శిఖ ఆత్మయుగల్సి బుద్ధిజనించెనుపొందుగాను
మనసుగల్గెను ఆత్మమారుతంబులుగూడ ఆత్మాంతరిక్షముల్ ఐక్యమైన
జ్ఞాతగల్గెను యిటు భూతములొకటివేరొకట సంగమమైన సుకరముగను
గీ॥ మానసాదిచతుష్టయ మూదిగాక । యెన్ని మోఅయ్యె గలసియు
యున్నతముగ । కాయమయ్యెనుతిరుగు నీమాయ వలన । భవవి॥ 89

సీ॥ చీము నెత్తురుచొల్లు చెలగిండ్రియములతో జీవుడు దేహము జెంది దాన
చీకాకుపడుచుండె చిన్నపెద్దగుచును శాశ్వతంబనుచును చావననుచు
ఆయువుకడయగు అర్థమెరుంగక యెంతను బహువేల ముచ్చటలును
మించిపోషించును మెలగు నిదియదియని దేహముచ్చినరీతి తెలియబోడు
గీ॥ తెలిసి నీపాదభక్తిని తెలియబోడు । చేనీపూజలెపుడును చేయబోడు
చెలగి నీయందు ఐక్యమై వెలయబోడు । భవవి॥ 90

సీ॥ అవుమ యని దనరు అక్షరంబులుమూడు కళనాదబిందువుల్ గాను వె
లసె। అవిమూడు లయమైనఓంకారరూపమా అదెపరమాత్మయా అది
యె మరియు । అగును ఆపోజ్యోతి అదితెలుసుకొనుటయె తారకంబనిరెల్ల
తాపసులును । ఏకాక్షరంబగు ఓంకారమునసర్వ వేదములును గల్గె వేద
సార । గీ॥ మదియెఅగు రామతారక మంత్రమున్ను । అదియెయగు ఆ
రహస్యముమది నెరింగి । గొల్చుటయెధర్మమగుమాయగూలుదాన । భ॥91

సీ॥ లక్ష్మణుండు అకారలక్షణుండాయెను శత్రుఘ్నుడు వుకారసంభవుండు
భరతుడును మకారభగితుండుఅయ్యెను సీతబిందువుఅగు ఖ్యాతిగాను
అర్ధమాత్రుండగు ఆరామభద్రుడు ఓంకారమను వక్కఅక్షరమున
లక్ష్యత్రయములవి లక్షణమైరామ తారకనామ మాత్రమును రామ
గీ॥ విభునికథయునుఅయ్యె ఆవిధినియరిగి । సేవయొనరించినను ముక్తి
సిద్ధమనిరి । వేద వేదాంతవిదులైన విబుధులెల్ల । భవవి॥ 92

సీ॥ మంత్రయోగము చేత మరిలయ హఠయోగముల నైన నీయొక్క మూల
మైన । ఆదిస్వరూపము అర్థము యొందాక తెలియఁడో అందాక మలినుఁడగుచు
పండితుండైనను బంధముగనుండని చెప్పి రార్యులు మరి చేష్టలుడిగి
నేత్రము లోకకొంతమాత్రముగా మూసి పూని మనోదృష్టిపూర్వకముగ
గీ॥ నిత్యమును నిన్ను సేవించు నీతిపరుఁడు । రాజయోగియు భోగియు
పూజనీయు । డగుచు వెలయును అచలుడై జగమునందు । భవవి॥ 93
సీ॥ కనుల రెండిటి మధ్యకదలెడు పాపల స్థిరమైన తేజముల్ జేర్చి యొకట
లక్ష్యత్రయంబుల లక్షించి చూచిన మనసు చంచలమును ధూనియుండు
ఆధారమాదిగా అజునిరంధ్రము దాక వెలుగు వీణాదండ వీధిలోన
కోటిసూర్యుల కాంతి సాటియై వెంట్రుకజవరీతిన వెలుంగు స్వప్రకాశ
గీ॥ మైన తేజము నిత్యము మనసు చేత । చూచు చూపుగో చూపుగా చూడ
దోచు । తేజమే నిన్ను యనిరది తెల్పి మునులు । భవవి॥ 94
సీ॥ నాశికాగ్రమునుండి నాలుగారెనిమిది పది పదిరెండుగా బరగుచున్న
అంగుళంబుల దాక అలరెడు స్వరమున పానగు నీలము మంచి పాగను బోలు
తేజము మెరుపు తెలుపుగా పసుపుగా బయలునదో చెందు పంచభూత
తత్వముల నుజూడదనరిన వెలిదృష్టి చంద్రసూర్యాగ్నుల చందముగను
గీ॥ మెరుపులగు బాలి తెలుపును మించి అఖిల । వర్ణముల సభంబు సబిందు
వాకృతిగను । గల్గుకళగన మధ్యలక్ష్యము స జెల్లు । భవవి॥ 95
సీ॥ యింద్రియములను ఆయింద్రియ విషయములను గల్గబడు భ్రమలన్నత
మనుచు । తెలిసియు మిక్కిలి మెలకువతోడను మెలగుచు భ్రమలను మె
లగబోక । దుష్టకార్యములందు తొలగించి బుద్ధిని స్థిరముగా నుంచియు
చేర్చిలోన । చూపుతో ఆత్మను మాంచియు తెలియుట అమనస్కమందురు
ఆర్యులెలమి । గీ॥ అట్టిదృష్టిని యొనగూర్చి ఆత్మమయత । సర్వమున సమ
బుద్ధిని సలుపజేసి । సర్వజగముల బ్రోవవే సాధుపోష । భవవి॥ 96
సీ॥ యింద్రియంబుల కెల్ల మొలికయగు మనసు భ్రమలకు మూలమా మనసె
యగును । సకలమాభ్రమలను సంభవింపగ జేయు అనుభవింపగ జేయు ఆ
మనస్సె । మనసు చేతనె సర్వభ్రమలు నివర్తించు మనసె జన్మము గూర్చు మా
నవులకు । అట్టిదైన మనసు పట్టియు స్థిరముగా పరమేశ్వరునియందు పదిలము
గను । గీ॥ యుంచుటయె మనసులయమని యెంచబడును । అదియె అమన
స్కమనబడు అదియుగనిన నాశమగు కర్మబంధము ఆశ తెగును । భవవి॥ 97

సీ॥ మనసుయెల్లప్పుడు పరమాత్మలో చేర్చ ప్రారబ్ధకర్మముల్ భంగమగును
మనసు చలించక పరిశుద్ధిగానున్న భక్తియోగము గల్గు మమత తొలగు
అమనస్కమును గోర ఆత్మలో కూటస్థమును మాని హృదయమందు వెలుంగు
ప్రాణవాయువు యుక్తి బట్టి కుంభించియు నాశికాగ్రమునను జేసి చూపు
గీ॥ చూచుటయె అమనస్కమా చూడ చూడ। చూపులో నిల్పు తేజము
చూడవచ్చు। సుఖముగనవచ్చు నీయందు చేరగవచ్చు। భవవి॥ 98

సీ॥ తానెవ్వరనియును దరచియు పరమాత్మ తావు నెరింగిన తానె లేదు
తాలేకయుండిన తానగు పరమాత్మ దృశ్యములను భ్రాంతి తొలగిపోవు
దృశ్యమంత నశించ దృష్టి బ్రహ్మంబగు మెరుకయు గల్గు ఆతరిని తాను
దృశ్యముగ దనితో చిమర్పు నశించు మెరుక మరుపులున్న అరయ నతడె
గీ॥ మరుపు మెరుకలు మానిన మనసె మనసు। దేహ భ్రమలు లేక చూపున నె
రుగు భ్రమలు। అన్ని నశియించినప్పుడే అచలమగును। భవవి॥ 99

సీ॥ కనుపడుచున్నట్టి కళలన్ని నశియించు యేదేది చేయనో యిలను అట్టి
వెల్ల నశించు నీ ఈశ్వరుని వెలుగు సాకారమైయున్న సకలమున్న
కల్లయౌనని తెల్సి కన్నులలోనున్న అఖిలము నెరిగియు అదియె బ్రహ్మ
జ్యోతియంచును నమ్మి చూచుచు సర్వదా కనుపడు జగమున కల్ల తొలగి
గీ॥ భావమున తాన ఆ పరమాత్మయనుచు। సుస్థిరుండయ్యె దృశ్యము చూ
డకున్న। మలినుడును గాడు చూపు నుమాత్రి మెరుగు। భవవి॥ 100

సీ॥ చూచెడు చూపును చూడంగబడునది రెండు వేరగుచుండు రెంటియందు
చూపు బ్రహ్మంబని చూడగాబడునది మాయయటంచును మది నెరింగి
చూడకన్పడునదే చూపను భ్రమమాని సుస్థిరంబగు ఆత్మ చూడవలయు
ఆ తురీయాతీతమై తగు ఆత్మనే చూపని తెలిసియు చూడ దోచి
గీ॥ తిరుగబడు వస్తు భ్రమమాని మెరుక తోడ। అలరి చూపు లో చూపున
నిలపి చూడ। నీవె కన్పడు చుందువు నిఖలమునను। భవవి॥ 101

సీ॥ మమతలకందదు మాటల తెలియదు చెవియొగ్గి వినగను చిక్కబోదు
కనులకు గనరాదు కాదు జౌనన బోదు వద్దనేయుండును వార్త లెరుగు
నిద్రించుచున్నను నిలచియుండగబోదు ముక్కులలో నుండి నిక్క చూచు
చిత్తము చేతను చింతించగారాదు వచ్చిపోవుచునుండు వదలబోదు
గీ॥ నడకగనరాదు అన్నిట వాణ్యమగును। తావుగనరాదు తెలియగా తర
ముగాదు। లేకపోలేదు వున్నది లేక కాదు। భవవి॥ 102

సీ॥ కర్మయోగము జేసి నిర్మలముగ నలేను హఠయోగమున నేనుండలేను
లయయోగ మొనరించు లక్షణం బెరుగను యమనియమాదులు నడుపబోను
కాయము వంచియు ఘన ఆసనంబులు సాధించగాలేను సలుపలేను
మానసు చంచలమును మరలించగాలేను మంత్రయంత్రంబుల మహిమ ఎరుగ
గీ॥ వేదశాస్త్రపురాణముల్ విని యెరుంగ। అర్థ మెరుగను అపవాదదుర్దశా
బ్ధి। తేలుచుంటిని నీదిక్కు తెలియకుంటి। భవపి॥ 103
సీ॥ స్వరశాస్త్ర మెరింగి సాధించగాలేను ప్రాణవాయువులను బట్టలేను
భూతహింస మొనర్చు బుద్ధిహీనుండను కులమత్సరమునను గూడియుంటి
అన్నదానము జేసి యున్న దెరుంగను కన్నవారల నతికష్టపెడుదు
నీమసేవ మొనర్చ నిలచి యొప్పదెరుంగ నీవున్నచో టెరుగ నిన్నెరుంగ
గీ॥ వున్నపద్ధతి పెద్దలు మెన్ని చెప్ప। మున్నసత్తో విని యెరుగను మమత
మెరుగ। మెన్నటికి నీకు పదిజేరుటన్న నేను భవపి॥ 104
సీ॥ ఓంకార మెరుగ అహంకారమిదున సలంకార మెరుగను లక్ష్య మెరుగ
టంకారమున నుంటి ఝంకార మెరుగను టక్కు తమాషల దక్క నెరుగ
నిక్క చూచెదుగాని చక్క నే తెలియను నిక్క మెరుంగను జంకబోను
డొక్కలో పామున్న దిక్కు నేయెరుగను పెక్కండ్లు తిరిగేటి కుక్క నెరుగ
గీ॥ పెక్కు కక్కలలో నుండి చిక్కుపెట్ట। చిక్కియుండితి యెందున లెఖ
గాక। నక్కవాడైన నీయొక్క దిక్కుగనను। భవపి। 105
సీ॥ దృక్కు దృశ్యంబుల దృక్కు నే నెరుగను వక్కడవైయున్న చక్కి నెరుగ
దృక్కు నీవనియును తెలిసి నే నెరుగను తొక్క డపడుచున్న దోవ లెరుగ
పెక్కు రక్కలగూడి పెనగుచుండుటెగాని నొక్కు టెరుంగ పై కెక్కు టెరుగ
పక్కలు మాచేటి దృక్కులో నిలచున్న పక్కి నెరుంగను చెక్కు టెరుగ
గీ॥ పెక్కు లేలను నీజడ వక్క టెరుగ। నిన్ను శరణంటి యేదైన నీదెసంటి
అన్నివిధులను లేకుంటి అన్నిటందు। భవపి॥ 106
సీ॥ గుణయుతుండవు నీవు గుణహీనుడను నేను దేవుడవీవు నే దేహినాను
సకలాత్ముడవు నీవు వికలాత్ముడను నేను సత్తుచిత్తులు నీవు చత్తు నేను
మాయకొంగవు నీవు మాయనుండితి నేను పుట్టిచావవు నీవు పుట్టు దేను
అన్నిరంగుదు వీవు నన్ను నేయెరుగను ధీరుడవీవు నే దీనమతిని
గీ॥ సేవలందెదవీవు నే సేవ జేతు। ముక్తి యొసగెదవీవు నే యుక్తి గొనుదు
నీవె నే నాదు నీదయ నిల్చియున్న। భవపి॥ 107

సీ॥ సూరిజనాధార సురరాజవందిత శృంగారవిగ్రహ మంగళంబు
అఖిలలోకనివాస ఆత్మస్వరూపక అంగలింగాధార మంగళంబు
హృత్పద్మమధ్యస్థ సత్పాదపంకజ లింగదేహాతీత మంగళంబు
[illegible]కరాచలధీర మార్తాండ శశి నేత్ర సంగభంగారంగ మంగళంబు
గీ॥ భక్తజనపోష చిద్రూప మంగళంబు। భావనాతీత సద్రూప 108
మంగళంబు। మంగళాత్మక నీకిదే మంగళంబు। భవవి॥

సీ॥ వంగోలుసీమను రంగైన మైనముపాటి పురస్థుడ బ్రాహ్మజాతి
వాడ మైనముపాటి వంశస్థుడను శివనారాయణుడనేను నాదుతండ్రి
మాలెకొండార్యుడు మాతల్లి సీతమ్మ అన్న రామామూర్తి యున్నయ
గును। నాతి శ్రీరామమ్మ నాజన్మవిధమిది అసలుకులంబేదొ అర్థమెరుగ
గీ॥ సీసములతోడ నొకమాలకేసి నీకు। మెడను వైచితిదాల్చిది మేటి 109
యనగ। నిల్పుజగతిని నీయందె నిల్పునన్ను। భవవి॥

సంపూర్ణము.

